# గోలకొండ పత్రిక

103545

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును.

REGISTERED No. N. 45 | హైదరాబాదు—దక్కన్. | REGISTERED No. M. 213

సంపుటము ౨ { ప్రభవ సంవత్సర పుష్య శు॥ ౭ శనివారము (౩౧ డిసెంబరు ౧౯౨౭) } సంచిక ౬౭

# కాంగ్రెసు అధ్యక్షోపన్యాస సంగ్రహము

భారత దేశము స్వాతంత్ర్యమును స్వపరిపాలనమును కలిగియుండవలెను. బ్రిటిషు సామ్రాజ్య సంబంధ మిందులకు నిరోధకరమైనచో ఆ సంబంధమును వదలుకొనుటకు మేము వెనుదీయము.

## శాసన సభల విధానము విఫలము—రాజకీయ మతభేదముల పరిష్కారము

సోదర ప్రతినిధులారా! సోదరీమణులారా!!
సోదరులారా!!!

భారత దేశమునకు స్వాతంత్ర్యమును బడయుటకు ఘనమొనరించుచున్న సంఘర్షణమందత్యంత విషమమగు నీ సమయమున జరుగుచున్న భారత జాతీయ మహాసభ కధ్యక్షత వహింపవలెనని నాయందు మీరు సంపూర్ణ విశ్వాసముంచి నా కాజ్ఞాపించినందులకు నాకు కలిగిన గాఢతమమగు కృతజ్ఞతను నేను సరిగా వెల్లడింపజాలకున్నాను. స్వరాజ్యసంరంభము కడు తీవ్రమైనది. అభివృద్ధితో పాటు మనము పరిష్కరింపవలసిన సమస్యలుగూడ క్లిష్టతరములగుచున్నవి. కావున అధ్యక్ష పీఠము నధిరోహించు వారి భారము హెచ్చైనది. నా లోపములను మీరు సోదర భావముతో మన్నించెదరనియు, నా విధులను నెరవేర్చుటలో మీరు దయార్ద్ర భావముతో తోడ్పడెదరనియు నాకు గట్టి నమ్మకముండుటవలననే నేను ఘనతరమగు బాధ్యతను వహించుటకు సాహసించితిని.

### వివిధపక్షములవారికి స్వాగతము

మన దేశమందున్న పక్షములవారందరు మరల కాంగ్రెసులో చేరి పనిచేయవలెనని నేను చేసిన విజ్ఞప్తిని వివిధ పక్షముల ప్రముఖులు దయతో మన్నించినందులకు నే నత్యధికమగు సంతృప్తిని సంతోషమును చెందుచున్నాను. దేశసేవయందు సహకారులగు నీ దేశీయ సోదరులనందరిని మరల కాంగ్రెసు పతాకచ్ఛాయకు నేను మనఃపూర్వకముగ నాహ్వానించుచు వారికి స్వాగతమొసగుచున్నాను.

### భారత దేశము—సామ్రాజ్యవాదము

భారత దేశము స్వాతంత్ర్యమును స్వపరిపాలనమును కలిగియుండవలెను. దేశమునందు నివసించు వారికందరికిని సమానావకాశముల నొసంగవలెను. దేశమునందలి అన్ని సంఘములకును గల సముచితములును న్యాయములునగు హక్కులను కాపాడుటకు పూచీపడవలెను. దేశమున శాంతిని నెలకొల్పవలెను. ప్రపంచమునందున్న దేశముల వారితోను మైత్రిని కలిగియుండవలెను, అనునదియే మన ఆశయమని మన దేశమునందున్న సకల పక్షములవారునుగూడ నంగీకరించియే యున్నారు. స్వాతంత్ర్యముగల దేశములలో నివసించుచున్న ప్రజలెట్టి హక్కుల ననుభవించుచున్నారో ఎట్టి స్థానమును బడసియున్నారో అట్టిహక్కులనే భారత దేశమునందు మేము ననుభవింపవలెను. బ్రిటిషు సామ్రాజ్యమునందు మా (భారతీయుల) కివి లభించుట సాధ్యమైనచో మేము సామ్రాజ్యమును వదలి పోగోరము. సామ్రాజ్య సంబంధ మిందులకు నిరోధకరమైనచో ఆ సంబంధమును వదలుకొనుటకు మేము వెనుదీయము.

### కాంగ్రెసు రాజకీయములు

భారత దేశమున కెటుల స్వాతంత్ర్యము లభింపగలదు? ఒక పుష్కరాంతరము పాటు భారత నాయకులు ప్రభుత్వమునకు పూర్తిగా సహాయపడుచునే యుండిరి. ఆ పద్ధతి విఫలమగుననియు దాని స్వభావమువలననే తెలియుచున్నది. సమానాశయములుగల పక్షములకు మాత్రమే పరస్పర సహాయము సాధ్యమగును. ఉద్దేశములు కేవలము విరుద్ధముగా నున్నపుడు సహకారము కుదురదు. అట్టి స్థితిలో బలవంతుల కోరికలకనుగుణముగా నడుచుకొనుటకు బలహీనులు తమ కత్యంత ప్రియతమములగు ఆశయములను గూడ వదలుకొనుటయే సహకారమనిపించుకొనవలసి యుండును. 1919 యిండియా ప్రభుత్వ చట్టమున బాధ్యతాయుత ప్రభుత్వము కాలక్రమమున నెలకొల్పబడునని వాగ్దానము చేయబడెను. భావికాలమున చాల అభివృద్ధి కలుగునని యెన్నియో ఆశలు చూపబడెను. వానితోపాటే యిటుల స్పష్టముగాగూడ తెలుపబడెను. భారతదేశమందలి అన్ని రాష్ట్రములును సంపూర్ణస్వాతంత్ర్యము బడసిన పిమ్మట నైనను భారత దేశమునందు కలుగగల బాధ్యతి అన్ని విషయములలోను అధినివేశములలో కలిగిన బాధ్యతతో సమానముగ నుండునని గూడ మేము తెలుపజాలము.

### శాసన సభల విధానము విఫలమగుట

అసహాయోద్యమమునకు నిరోధము కలిగిన పిమ్మట శాసన సభలకు వెళ్లి నియమానుసారముగా కార్యనిరోధమును కలిగించి ప్రజల యిష్టమునకు ప్రభుత్వము లొంగునటుల చేయదగునని వేరొక పద్ధతి సూచింపబడెను.

కాని నియమానుసారముగా కార్యనిరోధమును కలిగించుటగూడ అసంభవము అను విషయమును ఈ క్రొత్త పద్ధతిని సూచించిన కార్యనిరోధ వాదులును స్వరాజ్యవాదులు సహకార వాదులునుగూడ గ్రహించియుండదగును. వాదమునందు ప్రతివాదియే విశేషముగాగూడ నుండును నెడల వాదికి విజయమెన్నటికిని కలుగదు. ఈ అవష్టంభన పద్ధతియందు నమ్మకము గలవారి సంఖ్య మిక్కిలి హెచ్చుగనుండిన రాష్ట్రీయ శాసన సభలలో గూడ యీ పద్ధతి నెరవేరకపోవుట అనుభవమువలన విదితమైనది. కాని కార్యనిరోధక (స్వరాజ్య) వాదులు శాసన సభలకు వెళ్ళుటవలన కొన్ని లాభములు కలిగినవి. సంస్కరణములు నిష్ఫలములని విదితమైనది. తమ కనుకూలురగు వారినే శాసన సభ్యులనుగా దొరతనమువారు నియమించుట కవకాశము లేకుండ పోయినది. తమ నిరంకుశ చర్యలు ప్రజా ప్రతినిధులచే నామోదింపబడినటుల దొరతనమువారు లోకమునకు చాటుకొనుటకు అభ్యంతరము కలిగినది. కాని యీ యల్పలాభములవలన మనకు సిద్ధప్రయోజన మేమియును చేకూరలేదు. ప్రధాన నాయకులు పలువురు శాసన సభలలో చిక్కుకొని యుండుటచే యథార్థ జాతీయ ప్రాముఖ్యతగల సమస్యలను గూడ వారుపేక్షించుట తటస్థించినది. మన మందువలన నిరుత్సాహమును చెందనవసరము లేదు. మన అనుభవమును బట్టి మన పద్ధతినిపుడు మార్చుకొనుటయే కర్తవ్యమగును.

### అసహాయోద్యమము

మన ఆశయమును గూర్చి భిన్నాభిప్రాయమెంతమాత్రమును లేదు. దానిని సాధించుటకెదో యొక విధానమునే అనుసరింపవలెను. నిర్బంధము మన కేమియును లేదు. గత నలుబది యేండ్లలోను మనము మూడు పద్ధతుల ననుసరించితిమి. వాని ఫలితము మనకు విదితమైనది. (1) ఏకధాటిని 35 యేండ్లు ప్రభుత్వమునకు సహకార మొనరించితిమి. (2) పదునెనిమిది నెలలు అసహాయోద్యమమును సాగించితిమి. (3) శాసన సభలకు వెళ్లి నిరోధించుట నియమానుగుణ్యముగా కార్యనిరోధమును కలిగించుటయను పద్ధతిని నాలుగేండ్లు సాగించితిమి. వీనివలన కలిగిన లాభనష్టములను మనమిపుడు తెలుపగలము. మొదటిది సహకారము. దానివలన కొంచమైన లాభము కలుగలేదు. మూడవది శాసన సభలలో నిరోధించు పద్ధతి, దీనివలనగూడ నెట్టి మేలును కలుగలేదు. రెండవది అసహాయోద్యమము; దీనివలన గూడ ఆశించినంత మేలు కలుగలేదు. కాని దానికి కారణము సరిగా మన మా యుద్యమమును కొనసాగించుటకు అశక్తులమగుటయే. ఆ యుద్యమమునందు యెట్టి లోపమును లేదు. అసహాయోద్యమము మనకు నిరుపయోగము కాలేదు. దానికే మనము నిరుపయోగులమైతిమి. నేడు మరల మనము దాని నవలంబించవలెనని యున్నను ప్రస్తుతస్థితిలో దాని నవలంబించుటకెంతమాత్రమును అవకాశము లేదని గూడ నేనే యొప్పుకొందును. దేశమంతయు పరస్పర కలహములలో మునిగియున్నది. మత రాజకీయ కక్షలుగా చీలిపోయియున్నది. కావున యింతలో మనము మరల అసహాయోద్యమము నవలంబించుటకెట్టి అవకాశమును లేదు. కాని అసహాయోద్యమ భావము మాత్రము మన దేశమున స్థిరపడి వ్యక్తమైనది. అది భారత రాజకీయములలో తీవ్రోత్తేజకముగా నుండుట నిశ్చయము.

గోలకొండ పత్రిక

ప్రభవ సంవత్సర పుష్య శు॥ ౬

శనివారము

## సంఘ సంస్కార మహాసభ

ఉత్కృష్ట జాతీయతకు వికాసవంతమగు సంఘము మూలాధారము. స్వాతంత్ర్యసమరమునకు సాంఘికైకమత్యమత్యావశ్యకము. దేశసౌభాగ్యమునకు, సాంఘిక ప్రబోధము పట్టుకొమ్మ. ఈ సూత్రములను గ్రహించియే నేడు భారతీయులు రాజకీయరంగమునందు వలె సంఘ సంస్కారమందును పట్టుదలతో పనిచేయుచున్నారు. అక్రమమగు ప్రభుత్వమును ప్రతిఘటించునటుల, అరిష్టములగు ఆచారముల నిరోధించుచున్నారు. ఇది భారత భావి శుభసూచన.

హిందూ సంఘమును పీడించుచున్న దుష్క్రియలలో జాతియొకటి. ఈ జాతిసంస్థయే భారతదేశపు అద్భుత విజ్ఞానమునకు, హిందూసంఘ స్థిరత్వమునకు, ముఖ్యకారణమనికొందఱుతలంతురు. కానియిదివివాదాంశము. హిందూజాతివైభవ మెంతవఱకు వర్ణధర్మములపై నాధారపడియున్నదో, ఎంతవఱకు ప్రకృతి, చరిత్ర, జాతిని నరసించి ప్రబలిన వేదాంతము, మతములపై నాధారపడి యున్నదో, సూక్ష్మముగ నిర్ణయింప వశముగాదు. ఇంతేకాక వర్ణవిలోపముచే హిందూమతమంతరించి యుండునని గాని, హిందూసంఘము క్షీణించి యుండునని గాని ఎవ్వరును నిర్ధారణచేయ జాలరు. భూతకాలమున నీ సంస్థవలన నెట్టి మేళ్లు కలిగియున్నను (దీనిని మేము సంశయించెదము) నేడు మాత్రమిది యనేక అరిష్టములకు కారణభూతమగుచున్నది. మొట్టమొదట యేర్పడిన 4 వర్ణములు శాఖోపశాఖలుగ చీలి నేటికి సుమారు 3000 కులములేర్పడినవి. దీని వలన హిందూసంఘ మందలి ఐకమత్యము చెడి యనేకస్పర్ధలేర్పడినవి. ఒకప్పుడు సుగమముగ, మంగళకరముగ, శాంతితో సాగిన సంఘశకటము నేడు కిట్టుకీలలతో, క్రిందపడుచు లేచుచు, ప్రాకులాడుచున్నది.

ఇదియు నంతగాక యీ సంస్థనాటికి తన శుభలక్షణములను గోల్పోయి- జీవులను పీడించు పిశాచిగా పరిణమించినది. ఆది మాంధ్రులు, ఆది ద్రావిడులు, ఆదిహిందువులన బఱగు ప్రజలీ సంస్థకు బలియగుచున్నారు. అస్పృశ్యతాభావము అసహజమును అమానుషమునునగు భావము. ఇది హిందూ సంఘమునకు కళంకము. హిందూమతమునకు అవమానము. సంఘ సంస్కార సభాధ్యక్షులగు నటరాజనుగారు నుడివినటుల "జాతిని రద్దు పఱచుటయే నిమ్నజాతి సమస్యా పరిష్కారమునకు సాధనము. జాతులున్నంత కాలము జాతి బహిష్కృతులుండి తీరుదురు."

హిందూ సంఘమున నీ పరివర్తనము ఒక్కసారి రాజాలదు. దాన హానికూడ కలుగవచ్చును. కాని క్రమముగ నీ మార్పు వచ్చి తీరవలెను. వచ్చి తీరును. క్రైస్తవ మత ప్రచారము హిందువులను అస్పృశ్యతా నివారణకు పురిగొల్పినది. అటులనే వర్ణవిభేదమువలని అనర్థములు వర్ణ నిర్మూలనమున కవశ్యముగ దారి చూపగలవు. ఆర్యసమాజము, బ్రహ్మసమాజము, ఈ యుద్యమమునకు దోహద మొసగుచున్నవి.

హిందూ సంఘమున లోతుగ వేరులనాటి, తన విస్తీర్ణ శాఖలపై అమంగళకర పక్షులకు ఠావొసగుచున్న విషవృక్షమగుటచే నీ "వర్ణము" గూర్చి యింత వఱకు వ్రాయ వలసివచ్చినది. ఇదిగాక వివిధములగు దురాచారములింక యెన్నెని గలవు. ఇవి ముఖ్యముగా స్త్రీలకు సంబంధించినవి. బాల్య వివాహమువలన గలిగెడు నష్టములను ఆహ్వాన సంఘాధ్యక్షులగు డా॥ ముత్తులక్ష్మిరెడ్డిగారు, సంగ్రహముగ పేర్కొనియున్నారు.

10 సంవత్సరములు వయస్సువచ్చిననేగాని బాలికలు గర్భవతులగుటకు అనర్హులని వైద్యశాస్త్రము ఘోషించుచున్నది. జననేంద్రియములు అపరిపక్వ స్థితిలో నున్నప్పుడు మన బాలికలు గర్భవతులగుటవల్ల నిర్వీర్యమగు సంతానము గలుగుచున్నది. అనేక గర్భస్రావములకు కారణమగుచున్నది. సుఖముగా ప్రసవించినవారిలో నూటికి 50 మంది శిశువులును 1 సంవత్సరకాలమునకు మించి జీవించుటలేదు. అతిబాల్యములోనే ప్రసూతలగుటచేత జన్మించిన శిశువులకు తల్లిపాలుగూడ కరవగుచున్నవి. క్షీరోత్పత్తి కారణమగు ధాతువులు యింకను అప్పటికి అపరిపక్వ స్థితిలోనే యుండును. ఇందువల్ల శిశువులకు కృత్రిమాహారములను యిచ్చి పెంచి పోషించవలసివచ్చుచున్నది. ఒకవేళ యిట్టి గర్భిణిసంతానము పుట్టి పెరిగి పెంపొందినను ఆజన్మాంతము వ్యాధిగ్రస్తులై జీవకళలేక సౌఖ్యమునువిడి యెటులనో అల్పాయుష్కులై ఘటయాత్రను చాలించుచుందురు.

సంసారము కేవలముగా వ్యాధులకు నిలయమై నరక కూపములుగా మారుచుండుటకు అతిబాల్యవివాహములే కారణములు.

బాలికయొక్క శరీరము మాత్రమే అపరిపక్వస్థితిలో నుండుట గాక మనస్సుకూడా గృహస్థధర్మమునకు తగినట్టి చిత్తవికాసమును పొందియుండదు. 12 లేక 13 సం॥రముల వయస్సుగల పిల్లకు గృహస్థ బాధ్యతలుగాని సంసార సౌఖ్యముగాని పూర్తిగా బోధపడుటకు వీలులేదు. తాము పిల్లలైయుండుటవల్ల అనుభవించగల సౌఖ్యమును 14 సం॥ గల స్త్రీ అనుభవించజాలరు.

బాలవితంతువులగూర్చి యొక చిన్న ప్రశ్న యడుగ వచ్చును.

60 యేండ్ల వయస్సుగల తండ్రి తన చిన్నకుమార్తెకన్న చిన్నదగు వధువును వివాహమాడుట న్యాయమనియు ముక్కుపచ్చలారని పసిపిల్లలు జన్మాంతము నరకమను వైధవ్యము సంభవించునటులగునని నిర్బంధించుటయు సాంఘిక దౌర్జన్యము. కాదా?

పశుప్రవృత్తిని హిందూ సంఘమునెక్కనీటికి రక్షణ కర్తగ జూపుట హిందూ పురుషులకును స్త్రీలకును గొప్ప అవమానము. హిందూపురుషులంత యింద్రియ నిగ్రహములేని, కాముక పశువులుగారు. హిందూస్త్రీలు తమ భర్తల సుఖపెట్టజాలని చపల పీనుగులు కారు. అదియునుంగాక పురుషునిసంభోగేచ్ఛ దీర్చ నొక సంఘము నేర్పఱచుట స్త్రీ జాతియెడ నొక యపరాధము సలుపుటయే.

గృహస్థధర్మ మవలంబించెడి స్త్రీలకొక విధమైన నీతిని విధించి, యింకొక స్త్రీసంఘమునకు వ్యభిచారమే పరమధర్మమని విధించుట న్యాయముకాదు. ఇది బుద్ధిమంతులైనవారు సహించజాలని విషయము. ఒక స్త్రీజాతికి రెండు ప్రత్యేక విరుద్ధములైన ధర్మములు విధింపజాలవు. ప్రపంచమున వేశ్యలను వ్యభిచారము లేకుండునట్లు చేయుట అసంభవము కావచ్చును. కాని నరహత్య, చోరత్వములవలెనే జారత్వమునుకూడ అణచివేసి తగ్గించుటకు సాధ్యమగును.

శ్రీయుత ముత్తులక్ష్మిగారితో మేమేకీభవించుచున్నాము.

ఈ దురాచారముల ఫలితములను సాంఘికులెఱుగక పోవుటలేదు. వాని గర్హింపక పోవుటలేదు. కాని సాంఘిక బహిష్కారమునకు వెఱచియో, పూర్వసాంప్రదాయములయెడమూఢవిశ్వాసముచేతనేనో, వానిని పూర్తిగ తిరస్కరింపకున్నారు. అయినను యీ సంస్కారోద్యమము చల్లగా నలుగెడల ప్రాకి, ప్రజల మేల్కొలుపుచున్నది. పూర్వాచార పరాయణులలో నుండి శిఖండులగు మార్వాడి సంఘమువారు గూడ బాల్యవివాహములను ఖండించిరి. బరోడా వివాహ సంస్కార సంఘమువారు, విద్యాధికతరగ

## నా, గౌరీశంకరవర్మ అండు కో

మావద్ద సంస్కృతాంధ్ర, గ్రంథములును వైదిక, జ్యోతిష, వైద్య, నాటక, పద్య కావ్యములును, ఇంగ్లీషు, ఉర్దు, స్కూలు పుస్తకములును, వావిళ్లవారి సమస్త గ్రంథములును దొరకును, పుస్తకములను వి. పి గా పంపగోరువారు సగము పైకము ముందుగ మనియార్డరు ద్వార పంపవలయును పుస్తకములకు వ్రాయువారు జవాబుకార్డు వ్రాయవలయును. రెడ్డికుల నిర్ణయ చంద్రికయు 1928 సంవత్సరపు హాం అండు కో, డైరీలును అమ్మబడును

### ఆంధ్రి బుక్కు డిపో,

౫౬౮, రెసిడెన్సి పెద్దగడియారం చౌరస్తా దగ్గర
హైదరాబాదు దక్కన్

---

ఉపయోగించుడు

### "ఇలియాస్ కంపనీ"

యొక్క హిందూదేశమందు మిక్కిలి ప్రశంసింపబడిన, మేలైన, మంచి సువాసనగల, అన్నిరకముల తేయాకు, తేయాకుపొడి ప్రతి దుకాణమునందు దొరకును.

ఏజంట్ — గోకుల్దాసు మాళీ
౨౧౹౨ తాహారలీస్ట్రీటు సికింద్రాబాదు (దక్కన్)

---

విత్తనములు ! ! ! చెట్లు !

మా ౩౦ పేజీయందుగల విత్తనములు [గింజలు] చెట్లు మొదలైనవాటికి తెలుగు—క్యటలాగును ఆపేక్షించువారికి పంపబడును

వలయువారు — మ్యానేజర్,

### "ఇంటరునేషనల్ సీడ్ కంపెని"

లాల్ బాగు ఫోర్టురోడ్డు,
బెంగుళూరు సిటి
అని వ్రాయవలెను

---

### క్యాలెండరు కుబూలియ్యతులు

మావద్ద నూతన విధముగ గ్లేసుగల డ్రాయింగ్ కాగితములపై ముద్రించిన క్యాలెండరు కుబూలియ్యతులు విక్రయమునకు సిద్ధముగా నున్నవి. నూరు ప్రతులకు రు ౩. మాదిరి ప్రతులుకోరువారు అణాతపాలబిళ్ల పంపవలయును.

గోలకొండ ముద్రాక్షరశాల,
త్రూపుబజారు, హైదరాబాదు (దక్కన్)

---

### కావలెను

"శారద" మొదటి సం॥ ౧-౨ సంచికలు, రెండవసంవత్సరపు మొదటి సంపుటపు ౬ సంచికలు, మూడవ సం॥ ప్రచురింప బడిన సంచికలు అమ్మగోరువారు క్రింది విలాసమున ఉత్తర ప్రత్యుత్తరము జరుపగలరు.

శ్రీ
C/o గోలకొండ పత్రిక
హైదరాబాదు దక్కన్.

---

## వ్యాపార రహస్యము

వ్యాపారము వృద్ధియగు మార్గమేది?

పత్రికలలో ప్రకటనవేయించి ప్రచారము చేయుటయే.

కనుక

మా పత్రికలో ప్రకటన వేయించి లాభము పొందుడు.

మా తగ్గింపు ప్రకటన రేట్లు కొరకు నేడే దిగువ విలాసమునకు వ్రాయుడు.

మేనేజరు ప్రకటనశాఖ, గోలకొండ పత్రిక
హైదరాబాదు (దక్కన్.)

---

## అమృతాంజనము.

అన్ని నొప్పులకు వజ్రాయుధము.

చిన్న డబ్బి సీసా ... ౧కి రు. ౦-౧౦-౦

పెద్ద డబ్బిలు ... రు ౬-౪-౦

AMRUTANJAN
AMRUTAN
Best India Pain Balm
Amrutanjan Ltd
BOMBAY, MADRAS

అమృతాంజనము డిపో
౬, ౭ తంబుచెట్టివీధి, మద్రాసు,
౧౧౮ ఫేరిరోడ్డు, బొంబాయి

---

### రయ్యత్

(ఉర్దూ వార పత్రిక)

అజారు ౨౨ ఎ తేది మొదలుకొని ప్రతి సోమవారము హైదరాబాదునుండి వెలువడును ఇందు దేశ వార్తలు దినకాలములగు నైతిక, సాంఘిక, ఆర్థిక ములను ముఖ్యముగా రాజకీయ విషయములును, సమయానుకూలమున యోగ్యమగు చిత్రములును, ముద్రింపబడును డబల్ క్రౌన్ సైజున ౧-౨ పేజీలతో నుండును. సం॥ చందా రు ౬-౦-౦ లు.

మేనేజర్ రైయతు కార్యాలయము
త్రూపు బజారు, హైదరాబాదు దక్కన్.

---

## మాడ్రెస్ మోటార్ వరుకు్స

(త్రూపు) బజారు రోడ్డు, హైదరాబాద్.

మోటార్లు, కార్ బురెట్టా బాగుచేయుటలో నిపుణులు

పెట్రోలు వ్యయము పూర్వ ప్రమాణమునకు తేబడును. ధరలు కరకము. ఒకసారి పరీక్షించి చూడుడు.

## ప్రభుత్వావసరములు పూర్తిజేయును.

ప్రపంచమునందన్ని సంస్థలును డాజ్ బ్రదర్సు కమర్షియల్ బండ్లను ప్రయోగించును. జమైకాలోని కింగ్స్టనునందును, బొంబాయినందును, దక్షిణాఫ్రికాలోని కేపుటౌనునందును. తపాల శాఖ వారును ఆస్ట్రేలియా యందలి ఇతర ప్రభుత్వ శాఖలును ఈ బండ్లను వాడెదరని చెప్పిన తక్కువయే.

బలమైన ఫ్రేములును, స్ప్రింగులును, బలమైన ఇతర భాగములును నుండుటచే చాల ప్రయోజనకారియని యిదివరకే తేటపడును. అందుచేత ఇతర రకముల బండ్లకన్న డాజు బ్రదర్సు కమర్షియల్ బండ్లు చాల మేలైనవియును, తక్కువ వ్యయముగలవనియు, పేల చెప్పెదరు.

ఇతర వివరములు కోరువారును, ధరలు తెలుసుకొనువారును, దిగువ విలాసమునకు వ్రాయవలయును.

### బొంబాయి సైకలు అండు మోటారుఏజెన్సీ లిమిటెడ్.

౧౨౨, ౧౨౩, జేమ్సుస్ట్రీటు,
సికింద్రాబాదు (దక్కన్.)

[illegible]
టెలిఫోను నం. ౨౧౭.



# GROWTH

The growing public preference for Graham Brothers Trucks is strikingly told in the figures—

| *Year* | *Truck Sales* | *Gain* |
|---|---|---|
| 1921 | 1086 | |
| 1922 | 3401 | 213% |
| 1923 | 6971 | 105% |
| 1924 | 10791 | 55% |
| 1925 | 24056 | 123% |

The first nine months of 1926, with sales aggregating 29,336 trucks, show an increase of 78.4% over the corresponding period of 1925.

Progress—sound, swift, impressive.

*Graham Brothers Trucks, with Dodge Brothers ¾-Ton Commercial Cars, meet 91% of all hauling requirements.*

1-Ton Chassis 1½-Ton Chassis 2-Ton Chassis Delivered

# GRAHAM BROTHERS TRUCKS

*Built by Truck Division of Dodge Brothers, Inc.*

*SOLD BY DODGE BROTHERS DEALERS EVERYWHERE*

REG. No. M. [illegible]

REG. No. M. 2185

గోలకొండ పత్రిక.
ట్రూపుబజారు హైదరాబాదు, దక్కన్.
సంవత్సరము చందా రు. ౭-౦-౦
అర్ధసంవత్సరము „ , ౩-౮ ౨-౦
విడి ప్రతి ౦-౧-౬

శ్రీయుత

STAMP.

Printed and Published by K. Balakrishna Reddy at the Golkonda Press, Troop Bazaar, Hyderabad Dn.